శ్రీపాండురంగాయ నమః.

శ్రీ

మఱ్ఱిగుంట

# పాండురంగశతకము

దశావతార, శ్రీమద్రామాయణకథాప్రచురము

లీలావృత్తనిబద్ధము


గ్రంథకర్త

అరిగొండ శ్రీనివాసకవి

మఱ్ఱిగుంట - వర్వేడుపోష్టు, చిత్తూరుజిల్లా.



1944





వెల రు. 0-8-0

శ్రీగురుభ్యో నమః

# ఉపోద్ఘాతము



శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండును, ఆది మధ్యాంతరహితుండును, అనంతకల్యాణగుణగణవిశిష్టుం డును, ఆపద్బాంధవుండును, దయాసముద్రుండును, దీనజన రక్షాదక్షుండును, జగద్రక్షకుండును, ఆదినారాయణుండైన శ్రీమహావిష్ణువు కృత, త్రేత, ద్వాపరయుగంబులం దెన్నియో దివ్యావతారంబు లెత్తి, ఆయా యవతారంబుల కనువగు నామం బులచే, దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించి, ధర్మసంస్థాపన మొనర్చినది సర్వవేదపురాణేతిహాసంబులు ఘోషించుచున్న యవి.

పైమూడు యుగంబులందు నాదివ్యమూర్తి యొక్క యవ తారనామంబులను ఈకలియుగంబునం దేయే భక్తుడు ఏయే నామరూపంబులచే నిశ్చలభక్తిఁ గొని ధ్యానించెనో ఆయా నామరూపంబుల ప్రత్యక్షుండై యాభక్తుని యాపదల బాపి రక్షించియుండుట యఖిలలోకవేద్యమై యున్నయది.

కలియుగాదిని పుండరీకుడనెడి భక్తు నుద్ధరింపఁగోరి, భక్త వత్సలుండైన యాపుండరీకాక్షుండు పాండురంగ డనెడినామం బున పండరీపురంబున వెలసి, జ్ఞానదేవ, నామదేవ, ఘోరా కుంభార, తుకారామ, తులసీదాస, సక్కుబాయి, మీరా బాయి, జ్ఞానోబాయి, గోమాబాయి, ఇత్యాదిభక్తుల రక్షిం చినది ముల్లోకములందు నిర్వివాదాంశము

అట్టిపాండురంగనికి, సమస్తపాపహారణం బైనచంద్రభాగానదీపశ్చిమతీరంబున వెలయుపండరీపురంబున దీర్ఘకాలం బుండుటచే విసుగు జనించి, కలిమాయలకు జిక్కి, భక్తివిహీనులై, భక్తులు తన్ను వెదకికొని తన చెంతకు రానందుచే, పండరీపురంబును బాసి, తానే భక్తులను వెదకికొనుచు, సకల లోకసంచారియై వచ్చి, మద్గ్రామం బగుమట్టిగుంటపురిని (వటగర్తపురిని) నిజభక్తభజన సంకీర్తనంబును విని సంతసించి తద్గ్రామంబే తనకు శరణంబని తలంచి, నిలచెగాబోలు ననియే నాదృఢవిశ్వాసము. ఇట్టిపరమపురుషుం డగు శ్రీపాండురంగడు మద్గ్రామంబున వెలసినదాది జరిగినవృత్తాంతము ఏతచ్ఛతకమున వివరించినాడ.

శతకనిర్మాణహేతువు :—

ఒక్కనాడు, మద్గ్రామవాసియగు శ్రీపాండురంగని మాహాత్మ్యమును పద్యగద్యరూపమున వ్రాయసంకల్పించితిని. నాటిమధ్యాహ్నము మజ్జనభోజనాదు లొనర్చి నిదురించుసమయమున మద్గ్రామ నివాసియు, బ్రాహ్మణోత్తముడగు బ్ర. వే. పత్తంగి రాఘవాచార్యులవారి వలె స్వప్నంబున గాన వచ్చి, "నీసంకల్పము పవిత్రమైన దనియు, శుభదాయకమైన దనియు," చెప్పి మఱియు నిట్లనియె.

నీవు రచింప బూనినస్వామిమహాత్త్వంబును, పద్యగద్యములుగా వ్రాసినచో పండితులకేగాని, పామరులకును సులభవేద్యము కాదనియు, తన్మాహాత్మ్యంబును ఆబాలగోపాలమున కర్థమగునట్లు లీలావృత్తములతో నొకశతకంబుగ వ్రాయుమని వాక్రుచ్చెను. అంత నేను మేల్కాంటి.

ఇట్లు మేల్కాని యిది యంతయు శ్రీపాండురంగని మహాత్మ్యమని దీర్ఘాలోచనపరుడనై యున్నతరి నీశతకాదిని లిఖింపబడిన ఐదు ప్రార్థనపద్యములు నట్టు లేకుండా ముద్రిప నాగ్రమునుండి బయలువెడలెను. వెంటనే వాటిని వ్రాసి, కొలది దినములకే యీశతకంబును పూర్తిగావించితిని.

నేను వ్రాయబూనినయీశతకంబున వ్రాసినవృత్తముల నప్పటికప్పుడే సవరించుచు చేయింబవళ్ళు నాయొద్దనే యుండి ఏతచ్ఛతకమునకు తోడ్పడిన పల్నాటికవిసోదరులలో మధ్యములును, కవులును, పరమపౌరాణికులును, నగు బ్రి. శ్రీ కన్నెగంటి చినలింగాచార్యులవారైన నామిత్రునకు సంతాన, సౌభాగ్య, ధన, కనక, వాహనాద్యష్టైశ్వర్యములు శ్రీవిఠలుడొసంగి ప్రోచుగాత.

ఈశతకమును, సాంగోపాంగముగ విని, ఆనందించి, నన్నభినందించియు, ఏతచ్ఛతకము నచ్చొత్తించుటకు పదేపదే నన్ను ప్రోత్సహించుచు వచ్చిన, గుంటూరు క్రొత్తపేట వాస్తవ్యులును, పౌరాణిక పితామహులునునగు బ్రి॥గరికిపాటి లక్ష్మీనరసింహశాస్త్రిల వారికిని, క్రొత్తపేట ఆర్యవైశ్యభక్త సంఘమునకును, తత్సాంఘిక ప్రముఖులగు, కాకుమాను సూర్యనారాయణరావు గారికిని, వేమా వెంకటసుబ్బారావు గారికిని, ముప్పిరిశెట్టి పుల్లారావుగారికిని నాకృతజ్ఞతను దెలుపుకొనుచున్నాను.

ఇట్లు

బుధజనవిధేయుడు

అరిగొండ శ్రీనివాసకవి.

శ్రీపాండురంగాయ నమః

# శ్రీ పాండురంగ స్తోత్రము



మోహనరాగము - ఆదితాళము

(నమో హిందుమాతా మాతా నమో జగన్మాతా) అనువాదిరి

పల్లవి

నమో పాండురంగా, రంగా నమో భాసురాంగ ||న||

అనుపల్లవి

రమాధవా నీ, సమాన మెవరు, వ
శమా నిను బొగడ, జై సత్సంగా ||న||

చరణము

కరుణాకరుడవు - ఘనగాత్రుండవు
కరివరదుండవు - గరుడగమనుడవు
సురమునినుతుడవు - శుభదాయకుడవు
పరమాత్ముండవు - భక్తపాలుడవు.

మి॥ నిరతంబును, నీ - చరణయుగ్మమును
స్మరియించెద మం - దరగిరిధర హరి
ధరణి మరిగ్రుంట - ధామ నీపద
దాసుండను శ్రీసి - వాసుడను జై... ||న||

శ్రీ పాండురంగాయ నమః

# శ్రీ మట్టిగుంట పాండురంగశతకము

## ప్రార్థన

1 శ్రీకరా విశ్వేశ్వరా - గోవింద -
సిరు లిచ్చి నను గావరా,
సాకేతనగరేశ్వరా - భవభంగ -
జై విఠల్ పాండురంగా.

2 దేవాదిదేవ దేవా - మాధవా -
దివ్యనృ్మ మానుభావా
భావభవజనక రావా - నను గావ -
పాహిజై పాండురంగా

3 గోపీమనోనాయకా - నీలాంగ -
గోవర్ధనోద్ధారకా
ప్రాపు నీవే నాకికా - రుక్మిణీ -
ప్రాణేశ పాండురంగా

4 భక్తవత్సలుడవయ్యా - ముక్తికిని -
బాట నీవే గదయ్యా
శక్తి గలవాడవయ్యా - నిను జెప్ప -
శక్యమా పాండురంగా

5 శ్రీధరా కరుణాకరా - నీపాద -
సేవ జేసెద గావరా
మాధవా మరువకుమురా - కేల్ మోడ్తు -
మహనీయ పాండురంగా.

## విఘ్నేశ్వర ప్రార్థన

6 శివునిసుత గణనాయకా - వల్లభా -
చిత్తచోరవినాయకా
భువి నాకృతిని గావరా - యని హస్తి -
ముఖు గొల్తు పాండురంగా

## సరస్వతీ ప్రార్థన

7 కమలసంభవుని కాంతన్ - నాహృదయ -
కమలమునందున దలంతున్
విమలమైతగు మత్కృతిన్ - దనకృపన్ -
వెలయింప పాండురంగా.

## సంస్కృతకవిస్తుతి

8 వాల్మీకి వ్యాసమునులన్ - భోజకవి -
వర్య కాళీదాసులన్
తాల్మిచే భర్తృహరినిన్ - మనసారన్ -
దలతు జై పాండురంగా.

## ఆంధ్రకవిస్తుతి

9 నన్నయ్యభట్టారకున్ - కవితిక్క -
నను శంభుదాసు కవినిన్
సన్నుతుడు శ్రీనాథునిన్ - పోతనన్ -
స్మరియింతు పాండురంగా.

## సంగీతగురుస్తుతి

10 భూరిగానకళానిధిఁ - సుజ్ఞాన -
భూషణుండైన లక్ష్మీ
నారాయణప్ప గురునిఁ - నామనము -
నఁ దలఁతు పాండురంగా.

## సుకవిస్తుతి

11 ఘనులైన సూరిజనులు - దీనిలో -
గానుపించిన నెరసులు
విసిచినను ముందుగాను - సవరింతు -
విశ్వాత్మ పాండురంగా.

## కుకవినింద

12 దొడ్డకవిలక్షణములన్ - తెలియకనె -
దోషముల కుకవి యెన్నుఁ
"గొడ్డురాలుకు దెలియునే - పసిబిడ్డ -
గోడు" జై పాండురంగా.

## పురస్థలము

13 చిత్తూరుమండలమున - కాళహ -
స్తికి జలేశునిదిక్కున
పత్తనము మరిగుంటనా - విలసిల్లు -
పాహి జై పాండురంగా.

14 పురము పూర్వాపరములన్ - వెల్గొందు -
భువిపుణ్యతీర్థంబులౌ
వరకాళహస్తి యనియు - తిరుపతియు -
వరద జై పాండురంగా

15 యామ్యమున స్వర్ణముఖియు - సుక్షేత్రము -
నందు మళయాళగురుని
కామ్యప్రదంబైనవ్యా - సాశ్రమము -
గలవు జై పాండురంగా.

## పురవర్ణన

16 భూదేవి కొక్కబొట్టు - విదురైన -
భూసురుల కునికిపట్టు
యాదవులకాటపట్టు - మరిగుంట -
యాకర జై పాండురంగా

17 పగవారు చెలరేగిన - చలపట్టి -
పగదీర్చుకొనువారురా
మగవారు తెలిసికొనరా - మరిగుంట -
మగవారు పాండురంగా

18 పతిభక్తి గలసుమతులు - రుక్మిణీ -
పతిని ధ్యానించుసతులు
అతిరూపవతులు గలరు - మరిగుంట -
యందు జై పాండురంగా

19 మఱికోన నెక్కినపుడు - భామినులు.
మనములం దందు రెపుడు
మరిగుంటవాస విఠలా - మమ్మేలు -
మా యంచు పాండురంగా

20 ద్వాపరంబున ద్వారకా - గోపికా -
తనయులకు నున్నికట్టు
ఈపట్ల గోపికలకు - మఱిగుంట -
రమే యున్కి పాండురంగా

21 హరికృష్ణశ్రీనివాసా - యన గోపి -
కాళితో క్రీడింపవా
మరిగుంట శ్రీనివాసా - గోపికల -
మరువకుర పాండురంగా

22 జయరమాలోల రంగా - గోవింద -
జయ కృపాపాంగరంగా
జయ భాసురాంగరంగా - మరిగుంట -
జై విఠల్ పాండురంగా.

కవివంశావళి

23 మరిగుంటజనపదుండ - నీధ్యాన -
మహితుండ బుధహితుండ
అరిగొండవంశజుండ - శ్రీనివా -
సాఖ్యుండ పాండురంగా.

## పి తా మ హుఁ డు

24 అరిగొండవంశాబ్ధికిఁ - రాకాసు -
ధాంశుండు పుల్లయ్యనా
మరుదంశసంభవుండు - మత్పితా -
మహుండు జై పాండురంగా

25 అశ్వరాజంబు నెక్కి - కాళహ -
స్త్యధిపుసన్నిధి మంత్రినై
విశ్వవిఖ్యాతుడయ్యె - మాతాత -
విశ్వాత్మ పాండురంగా

26 అమ్మ పితునకు పుత్రులు - ముగురు గల -
రందు రెండవసుతుండు
సమ్మతుడు కాళప్పనా - బరగు జన -
సమ్మతుడు పాండురంగా.

## జ న నీ జ న కు లు

27 అతిథిజనకల్పవల్లి - సాధ్వి వే -
రమ్మ నను గన్నతల్లి
అతిశాంతసత్యమూర్తి - కాళప్ప -
యా తండ్రి పాండురంగా

## సోదర సోదరీ మణులు

28 నతజనుల్ మద్గురులకు - పుత్రులము -
నట్టూరము పుత్రీమణుల్
పతితపావననట్టూరుకా - గలరు గుణ -
వతులు జై పాండురంగా.

## ప్రథ మా గ్రజుడు

29 అందరికి నగ్రజుండు - నారాయ -
ణాఖ్యుండు సద్గుణుండు
ఇందుసన్నిభయశుండు - నీభక్త -
హితుడు జై పాండురంగా

30 ధర్మస్వరూపఘనుడు - నాయన్న -
తతశాంతసత్యరతుడు
నిర్మలాంతఃకరణుడు - నిను గొల్చు -
నిశ్చలుడు పాండురంగా

31 భోజనముడన బరగిన - నాయన్న -
బుధకల్పభూజ మనగా
రాజాంశజుండనంగ - నుతికెక్కె -
రా విఠల్ పాండురంగా

32 హరికి సిరి కూర్మితోడ - భార్యయై -
నట్లు మా పెద్దన్నకు
తరుణి మంగమ్మ యయ్యె - భార్యగా -
తగ విఠల్ పాండురంగా.

ద్వితీయాగ్రజుడు

33 బలరామకృష్ణులనగా - నీవు ద్వా -
పరమునను బుట్టి తనఘా
కలి రామకృష్ణాఖ్య నా - చిన్నన్న -
గాన్యైతి పాండురంగా

34 పతిభక్తి గలసుశీలా - నాచిన్న -
వదినె రమణమ్మ చాలా
అతిశాంతగుణవిశాలా - నిత్యక -
ళ్యాణ జై పాండురంగా

35 ఇందిరారమణియగా నా - చినవదినె -
నెంతని నుతింపగలరా
వందనంబులు జేతురా - యాతల్లి -
పదములకు పాండురంగా.

ధర్మపత్ని

36 దివ్యగుణరత్నమాలా - నామనసు -
తెలిసి వర్తించుబాలా
భవ్యసద్భక్తిశీలా - కన్నమ్మ -
భార్యయగా పాండురంగా.

## అను జుడు

37 అలరామచంద్రసముడు - నాతమ్ము -
డౌ రామమూర్తి ఘనుడు
బలధైర్య శౌర్యయుతుడు - నీపాద -
భక్తుండు పాండురంగా.

38 అరిజనభయంకరుండు - నాతమ్ము -
డగు రామమూర్తి కరము
కరమొప్పగా ధనమ్ము - వరభార్య -
గానయ్యె పాండురంగా

39 శ్యామసుందరశరీర - శుభకరా -
యజ్ఞేశ విశ్వంభరా
మామనోంబుజభాస్కరా - మాం పాహి -
మరిగుంట పాండురంగా.

## సంపాదితగ్రామములు

40 ధర నిసుకతాగేలికో - బాకు సీ -
తారామపేట లివియు
మరిగుంట, యలవెంకటా, పురములును
మావిరా పాండురంగా

41 ఈపత్తనంబులకును - మేము ప్ర -
ద్వేశులుగ బరగుటకును
నీపరమకృపయే కదా - కారణము -
నిఖిలేశ పాండురంగా

42 నిగమార్థసారధీర - సువిచార -
నిర్ద్వంద్వ నిర్వికారా
ఖగగ నవనీతచోరా - సాకార -
కరుణాత్మ పాండురంగా.

# దశావతారములు

## మత్స్యావతారము

43 చేపవై జలధి జొచ్చి - సోమకుని -
జీల్చి వేదములు దెచ్చి
తాప మార్పితి వేధకుఁ - మత్స్యావ -
తార జై పాండురంగా.

## కూర్మావతారము

44 సురలు రాక్షసులు గలిసి - క్షీరాబ్ధి -
సుధకునై మథియించగా
తరిగొండ ధరియించితి - కూర్మావ -
తార జై పాండురంగా.

## వరాహావతారము

45 ధరణి చాపగను జుట్టి - జలధిలో -
దాగ హేమాక్షు బట్టి
తరిమి పడగొట్టినట్టి - వరాహావ -
తార జై పాండురంగా.

## నరసింహావతారము

46 పరమభాగవతోత్తముఁడు - ప్రహ్లాదు -
బాలింప హేమకశిపుఁ
దరిజూచి బోరిగొంటివా - నృసింహావ -
తార జై పాండురంగా.

## వామనావతారము

47 బలిని పాదత్రయంబుఁ - యాచించి -
పాతాళలోకమునకుఁ
అలుకమై నతని ద్రొక్కఁ - వామనుడ -
వైన జై పాండురంగా.

## పరశురామావతారము

48 ముయ్యేడుమార్లు దిరిగి - రాజన్య -
మూర్ధంబులెల్ల దరిగి
అయ్యాజిసుతున కొరగు - పరశురా -
మాఖ్య జై పాండురంగా

## శ్రీరామావతారము

49 కౌసల్యకాత్మజుడవై - దశకంఠు -
ఖండించి మునినుతుడవై
దాసవ్యాప్తి వైతి - రామావ -
తార జై పాండురంగా.

## కృ ష్ణా వ తా ర ము

50 ద్వాపరయుగంబునందు - శిశుపాల -
దంతవక్త్రుల గూల్చితా
ద్రౌపదీమానరక్షా - కృష్ణావ -
తార జై పాండురంగా.

## బౌ ద్ధా వ తా ర ము

51 జగతి మాయాదేవికి - జన్మించి -
జనముల కహింసావిధిని
తగ బోధజేసి తౌరా - బౌద్ధావ -
తార జై పాండురంగా.

## క ల్క్య వ తా ర ము

52 ఖలుల బొలియింప నెంచి - మఱిగుంట -
గ్రామమునందునను నిలిచి
కలికిగా మదిని దలచి - వెలయుస -
త్కల్యాణ పాండురంగా.

53 శరణు మహిమాత్మరంగా - నీ కిదే -
శరణు దుర్గర్వభంగా
శరణు శ్యామాంగరంగా - పండరీ -
శ్వర శరణు పాండురంగా.

## శ్రీ పాండురంగస్వామి

## మట్టిగుంట పురిలో ప్రవేశించుట

54 పదియుతొమ్మిదివందలట్ల - గడిచి ము -
ప్పది దాటి యటుమీదట్ల
గదియునారవయేటను - నీమహిమ -
గాంచితిమి పాండురంగా.

55 గొల్లయిండ్లను వెతకుచు - నీ కొక్క -
గుడిసెయైన లభింపక
గొల్లయిండ్లను జేరితో - మామట్టి -
గుంట కో పాండురంగా.

56 కులపక్షపాతి వనుచు - నా కొక్క -
గురుతు కన్పడె నీయెడ
ఇల గొల్లలను గలయగా - మరిగుంట -
నీ వుంట పాండురంగా

57 నీ రాక మంచిదనక - దుష్టజన -
నికరంబు లోర్వలేక
పోరాటమునకు పోక - నపజయము -
పొందరే పాండురంగా.

58 నీభక్తి నట్టి నెట్టి - పలుమారు -
నిన్ను దూషించినట్టి
నీభజన జెరిచినట్టి - ఖలు లెల్ల -
నిలిచిరే పాండురంగా

59 న్యాయ్యంబు దెలిసియుండి - న్యాయ్య మ -
న్యాయ్యముగ జేయుచుండి
కొయ్య యనిపించుకొనదే - నీభక్త -
కోటిలో పాండురంగా.

60 లక్షణంబులు దెలిసియు - న్యాయ్యంబు -
లలితగతి నడుపలేక
పక్షపాతాత్ములైన - వా రెల్ల -
పాడైరి పాండురంగా.

61 దుష్టనాశకుడ వనియు - శిష్టసం -
దోహరక్షకుడ వనియు
స్పష్టమయ్యెను జనులకు - మఱిగుంట -
సర్వేశ పాండురంగా.

62 శృంగారదేహరంగా నానమ -
స్కృతి నీకు పాండురంగా
రంగత్కృపాంతరంగా - రుక్మిణీ -
రమణ జై పాండురంగా

# శ్రీ మద్రామాయణము

## బాలకాండము

63 దశరథాత్మజుడవయ్యు - ఘోరమగు -
తాటకిని మర్దించియు
కుశికజూమఖము గాచియు - శిలగని మ -
గువ జేయుపాండురంగా

64 అఘరహితుడా తపసియు - "మిథిలలో -
అవనిజాకల్యాణము
రఘుపతీ"యన వెడలితీ - కల్యాణ -
రాముడన పాండురంగా.

65 శివునిచాపమును ద్రుంచి - రమణియా -
సీతను పరిగ్రహించి
భువి భార్గవుని జయించి - సాకేత -
పురి జేరు పాండురంగా.

66 బాలకాండం బిదేరా - నీపాద -
భక్తితో వ్రాసితినిరా
ఆలింపరా శ్రీకరా - శ్రీనివా -
సాఖ్యుండ పాండురంగా.

## అ యో ధ్యా కా ం డ ము

67 శ్రీరామచంద్రమునకు - పట్టాభి -
షేకంబు దశరథుండు
గౌరవంబుగ నొనర్ప - మది నెంచ -
గా విఠల్ పాండురంగా.

68 అపుడు మందర కైకకున్ - దుర్బోధ -
లపరిమితముగ జేయగన్
నృపుని రెండువరంబులన్ - కైక గో -
రెను విఠల్ పాండురంగా.

69 భరతునకు రాజ్య మొసగన్ - శ్రీరామ -
భద్రు డడవులకు నేగన్
వరములను కైక గోరెన్ - దశరథుని -
వరుసగా పాండురంగా.

70 జనకునాజ్ఞను దీర్పగా - లక్ష్మణుడు -
జానకియు వెంట రాగా
చనె నడవులకును వేగ - రాఘవుడు -
జై విఠల్ పాండురంగా

71 జానకీరఘురాములున్ - సౌమిత్రి -
సహితముగ మునివేషులై
కాన కేగుట భరతుడు - విని యన్న -
గాంచ జనె పాండురంగా.

72 శ్రీరాము గని భరతుడు - కరము ప్రా -
ర్థించి పాదుకలను గొని
భూరిముని వేషధరుడై - సాకేత -
పురి జేరె పాండురంగా.

73 ధారుణీభర మంతను - పాదుకా -
ద్వయముపై నుంచి తాను
జేరె నంది గ్రామముగ - భరతుండు -
శ్రీవిఠల్ పాండురంగా.

74 ఇది యయోధ్యాకాండము - నీపాద -
హితదాసులకు దాసుడగ
యదుకులోద్భవ వ్రాసితిగ - శ్రీనివా -
సాఖ్యుండ పాండురంగా.

## అ ర ణ్య కాం డ ము

75 చిత్రకూటంబు వాసి - రాఘవుడు -
జేరె దా పంచవటికి
చిత్రముగ దశవదనుడు - గొనిపోయె -
సీత నట పాండురంగా.

76 జనకపుత్రికను వెదుకగ - వనములో -
జని జటాయుని గాంచెగ
యినజుతో మైత్రి వడసెగ - దాశరధి -
యింపలర పాండురంగా.

77 అరణ్యకాండ మనగా - వ్రాసితిని -
ఆదిమధ్యాన్తరహిత
సూరినుతపాదసహిత - శ్రీనివా -
సుండ వై పాండురంగా.

## కి ష్కి ం ధా కా ం డ ము

78 సురరాజసుతుని జంపి - కిష్కింధ -
సుగ్రీవునకు నొసంగి
హరి గడపె కాల మచట - వర్షఋతు -
వౌట వై పాండురంగా.

79 వర్షఋతు వరిగినంత - యినజుండు -
వచ్చి రామునికి మ్రొక్కెన్
హర్షమున సీతమ్మను - వెదుకవలె -
ననుకొనిరి పాండురంగా

80 వనచరుల బంపించెను - రవిసుతుడు -
వైదేహి వెదుకగాను
హనుమ కిడి పంపించెను - ముద్రికను -
హరి తాను పాండురంగా.

81 కర మొప్పగన్ వ్రాసితిన్ - కిష్కింధ -
కాండంబు నే సమ్మతిన్
అరవిందభవసన్నుత - శ్రీనివా -
సాఖ్యుండ పాండురంగా.

## సుందరకాండము

82 శంకలే కబ్ధి దాటెన్ - హనుమని -
శ్శంక జానకిని జూచెన్
లంక దా నంత కాల్చెన్ - తిరుగన్ జ -
లధి దాటె పాండురంగా

83 వానరేశుడు భక్తితో - రామునికి -
వందనం బాచరించి
జానకీవృత్తాంతమున్ - దెలిపె తా -
సర్వంబు పాండురంగా

84 దానవాంతక వ్రాసితిన్ - వేడ్క సుం -
దర కాండమును సభక్తిన్
శ్రీనివాసాహ్వయుండ - నీపాద -
సేవకుడ పాండురంగా.

## యుద్ధకాండము

85 వనచరుల నియమించెను - రాఘవుడు -
వారినిధి బంధింపను
వినయమున శరణుజొచ్చె - రాముని వి
భీషణుడు పాండురంగా

86 వనచరులతో దాటెను - జలనిధిని
వసుధాసుతా కాంతుడు
చని లంక ముట్టడించెన్ - రక్కసుల -
జంపుటకు పాండురంగా

87 దశకంఠకుంభకర్ణుల్ - పోరాడ -
దలకొన్న సంహరించెగా
దశరథాత్మజుడు సీతగా - చేపట్టె -
ధర్మముగ పాండురంగా

88 భూమితనయానుజులతో - కపులతో -
పుష్పకవిమాన మెక్కి
రామచంద్రుడయోధ్యగా - జేరెగా -
రహింబంర పాండురంగా

89 శ్రీవసిష్ఠాదిమునులు - రాజ్యాభి -
షేకంబు రాఘవునకు
గావించి రాజ్యంబ - వైభవము -
గా విరల్ పాండురంగా

90 వరయుద్ధకాండ మునగ - భక్తితో -
వ్రాసితిని వేడ్క జెలగ
జనగొండవంశజుండ - శ్రీనివా -
సాఖ్యుండ పాండురంగా

## స్తుతి లీలావళి

91 సంసారసాగరంబుగా - సరియింప
సాధనం బొండు గలదే
కంసారి నీదుభక్తి - యనునావ -
గాక జై పాండురంగా

92 నిధి జన్మ మీాదేర్పదు - నీదుస -
న్నిధి జన్మ మీాదేర్పురా
బుధవర్గకల్పభూజా - తరమ నిను -
బొగడంగ పాండురంగా

93 అతివ మృత్యుదేవతా - తజ్జనకు -
డౌ దండధరసదృశుండు
క్షితి వీరిసంబంధమా - బంధువ్రాతె -
కింకరులు పాండురంగా

94 ప్రాణములు బాసినంత - కింకరులు -
బంధించి దండింతురు
ప్రాణంబు లుండునప్పుడె - బంధువులు -
బాధింతురు పాండురంగా

95 చుట్టాలు కొంగ లనెడి - భాగవత -
సూక్తిని మరువ గగదు
చుట్టాలభ్రమత వీడి - నక్కోటు -
చొనవలె పాండురంగా

96 పతిమనసు గుర్తెరింగి - పతితంబు
వర్తించు కోమలాంగి
అతులితంబౌ స్వర్గముగ్ - పొందు నిల
హరి విఠల్ పాండురంగా

97 కులము రూపము సుగుణముల్ - గలయట్టి -
కొమ్మలకు కాంతయైనన్
కలుగదా మోక్షపదవి - పురుషులకు -
కమలాక్ష పాండురంగా

98 మగడు పతితుండైనను - నిజభార్య -
మానవతి యైనచోను
తగ స్వర్గసుఖము తాను - చూరగొను -
ధరణిపై పాండురంగా

99 తిన తనకు కూడుండగా - నూరూరు -
తిరిగి డొక్కకు దండిగ
తిని సిగ్గు లేక తిరుగు - జడుడు నిన్ -
తెలియునా పాండురంగా

100 తాను దుర్లోభిమతియై - పేదలకు -
దానంబు చేయలేక
పూని జేసెడి దాతలన్ - వెకిరించు -
పుణ్యాత్మ పాండురంగా

101 ప్రాయంబన క్షయమురా - బుద్బుద -
ప్రాయంబు కాయంబురా
ఆయుష్య మల్పంబురా - స్థిరము నీ -
పాదమే పాండురంగా

102 అలతుకారాము దపుడు - నీ కేమి -
యర్థం బొసంగె జెపుడు
ఇల నన్ను గావ నిపుడు - దయజూడు -
మెంతయును పాండురంగా

103 భక్తురాలైనయట్టి - యాసక్కు -
బాయి నీ కేమి పెట్టి
ముక్తి పొందెను జెప్పవే - నీదాస్య -
మునగాక పాండురంగా.

## కవనవరశీంకుట

104 పలవాటికవినోదరుల్ - దీని గని -
భళి యటం చనినారురా
సిలుగులగ బెట్టకుమురా - వారి ర -
క్షింపరా పాండురంగా

## ఫలశ్రుతి

105 సంతానరహితులైన - లోకు లిల -
సద్భక్తిసహితు లగుచు
సంతతం బీశతకమున్ - పఠియింప -
సమకూరు పాండురంగా

106 భక్తితో దీని విన్న - ప్రతిదినము -
పఠియించి వ్రాసికొన్న
ముక్తి తంగేటిజున్నా - మనుజులకు -
మురవైరి పాండురంగా.

శ త క స మా ప్త కా ల ము

107 శ్రీమత్స్వభానునామా - బ్దమున కా -
ర్తికశుద్ధదశమివరకు
నీమముగ లిఖయించితిగా - శతకమును -
నే విఠల్ పాండురంగా

మ ం గ ళ ము

108 మంగళము శ్రీనివాసా - మంగళము -
మరిగుంటపురినివాసా
మంగళము చిద్విలాసా - నీకు జయ -
మంగళము పాండురంగా.



## గ ద్య ము

ఇది శ్రీపాండురంగవరప్రసాదలబ్ధకవితావిచిత్ర మల్లెల
గోత్రపవిత్ర అరిగొండవంశసుధార్ణవసంపూర్ణ
రోహిణీకళత్ర వేరమ్మ కాశప్పతృతీయ
పుత్ర శ్రీపాండురంగ సరసకవిసం
గీతహరికథాప్రవీణ బిరుదాం
కిత శాంతగుణధురీణ బుధ
జనోల్లాస శ్రీనివాస
కవి ప్రణీతం బగు
శ్రీమట్టిగుంట
పాండురంగ
శతకము
సంపూర్ణము
శ్రీ శ్రీ శ్రీ

—o—

## మంగళము

మధ్యమావతిరాగము - రూపకతాళము

పల్లవి

మంగళంబు పాండురంగ-మంగళము కృపాంతరంగ ||మం||

అనుపల్లవి

మంగళంబు కోమలాంగ - మాసతీమనోబ్జభృంగ ||మం||

చరణము

దేవ దేవకీనందన - దివ్యకమలదళనయనా
దేవాధిపవినుతసుగుణ - ధీరజనచయావనచణ
భావభవజనకకరుణా - పారావారసుచరణా
రావవే ప్రసన్నవదన - కళ్యాణమయాభరణా
మి. పావనమునిహృదయసదన- బ్రహ్మాండోదరసురదన
జీవలోకజీవనరణ - జితపూర్వామరవితాన
నావాడవసి సనాతన - నమ్మితి నిను గరుడగమన
శ్రీవిలసిలు మట్టిగుంట - శ్రీనివాసకృపాలన ||మం||

చంద్రికా ముద్రాశాల, గుంటూరు.

# తప్పొప్పుల పట్టిక

| పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 2 | కొమ్మలకు కాంతగ్గైనన్ | కొమ్మ కులకాంతయ్యైనన్ |

గ్రంథము వలయువారీక్రింది అడ్రిసుకు వ్రాసికొనవలెను :-

ఆరిగొండ శ్రీనివాసకవి,

మట్టిగుంట,

ఏర్పేడుపోష్టు,

చిత్తూరుజిల్లా.

